Gopala Dasu, Mutnoori

అపరప్రహ్లాదుడైన ముట్నూరి శివరామకృష్ణయ్యజీవితము

కాకినాడ, 1923

Record no. 782

Gopala Dasu, Mutnoori

Aparaprahlāduḍaina Muṭnūri Śivarāmakṛṣṇayyajīvitamu

Kākināḍa, 1923

Record no. 782

## Bibliographic Record Target

Gopala Dasu, Mutnoori
అపరప్రహ్లాదుడైన ముట్నూరి శివరామకృష్ణయ్యజీవితము : రెండవభాగము / రచయిత Mutnoori Gopala Dasu.- కాకినాడ : Mutnoori Gopala Dasu, 1923.
v. <2> :ports. ;17 cm.
Record no. 782

Gopala Dasu, Mutnoori
Aparaprahlāduḍaina Muṭnūri Śivarāmakṛṣṇayyajīvitamu : reṇḍavabhāgamu / racayita Mutnoori Gopala Dasu.- Kākināḍa : Mutnoori Gopala Dasu, 1923.
v. <2> :ports. ;17 cm.
Record no. 782

# The Life

OF






# M. SIVARAMAKRISTNAYYA



BY

Mutnoori Gopala Dasu.



2nd Part.

ఓం తత్సత్.

శ్రీ గురుభ్యోనమః

# అపరప్రహ్లాదుడైన [illegible]రి శివరామ కృష్ణయ్య చరిత్రము.




## (రెండవ భాగము)

ఇది

ముముక్షువులకు మంచిమార్గ దర్శకముగా వీని తండ్రిగారిచే శాస్త్రసమ్మతముగా రచింపబడి ప్రకటింపఁబడియె.




కాకినాడ

పట్టమట్ట వెంకట రంగారావుగారి

రంగా అండ్ కోలో ముద్రింపబడియె,

**1923.**



తండ్రి — శ్రీ ము॥ గోపాలదాసు.

కుమారుడు — శ్రీ శివరామకృష్ణయ్య.



మాతాపితృ భక్తితో అపర ప్రహ్లాదుండని పేరొంది
కీర్తి శేషుండగు ముట్నూరి శివరామకృష్ణయ్య.

ఆర్యవర్యులారా !

గ్రంథకర్తయొక్క వంశస్థులు.

గీ. సారవేదాంతశాస్త్ర విచారపరులు
సూరిశేఖరులరయ ముట్నూరివారు
అమలకౌండిన్యగోత్రజులచ్యుతాంఘ్రి
కమలరోలంబసంకాశవిమలమతులు.

క. భ్రమరాంబా వేంకటర
త్నములకుఁ బ్రభవించెనందు నందనుఁడుగణో
త్తముఁడుఁ బదార్థవిచక్షణుఁ
డమలుండొకరుండు గోపయాఖ్యతఁ బేర్మిన్,

గీ. తనరు నాతత్త్వవేత్తకు ధర్మపత్ని
అతిథులకు వేళలరయక యన్నమిడెడు
శ్వశురకనయంబు సాయంబుసలుపుగరిత
సుబ్బమయువంగ ; సుగుణియాసుతునితోడ.

ఇట్లు మ॥ రా॥ శ్రీ తురగా వెంకటాచలం పంతులు బి. ఏ., గారిచే వ్రాయబడినది.

సోదరులారా! " సుబ్బమయసంగసుగుణియాసుతునితోడ " అనేచరణమునందుగల సుతునితోడ అను శబ్దమువలన శివరామ కృష్ణయ్యకు న్వర్తింపబడి

సర్వులచే అపర ప్రహ్లాదుడని పేరొంది కీర్తిశేషుం డైనాడు. ఇతనివియోగము సమస్తమైనవారికి విషాదమును కలించినది. ఇందుకు లోకమాన్యులగు శ్రీ వంతులుగారు మొదలైనవారిచే వీనితండ్రిగారికి వ్రాయబడిన పరామర్శ ఉత్తరములు జూడుడు. ఇతను యెంత సుగుణాకరుడో మీకే బోధపడగలదు. మంచి ప్రవర్తన గలవారు లోకమునకు పుండరీక సత్యవంతుల వలె మార్గదర్శకులగుదురుగదా ! ఇంక వీని చరిత్ర చూడుడు.

ఇట్లు వీనిసన్మిత్రుడు సుజనవిధేయుడు వేమరాజు సర్వేశ్వరరావు.

---

బ్రహ్మశ్రీ గోపాలదాసుగారికి—

దురిసేటి శేషగిరిరావు అనేక నమస్కారములు—

మీకు తటస్థమైన ఆపత్తుకు లోకమంతా విచారించుచున్నారు నాకు అపారమైన దుఃఖము కలిగినది మీరు తెలిసినవారు మీకు ఒకరు చెప్పవలసినది ఏమిన్నిలేదు ప్రారబ్ధము అనుభవింపక తప్పదు మిమ్ములను నేను చూడలేను గనుక నాకువున్న



విచారము ఈ పత్రము ద్వారా తెలియ చేయుచున్నాను. ధైర్యము వదలిన లాభమేమియు లేదు.

19-9-17.

చిత్తగించవలయును,
దు॥ శేషగిరిరావు.

---

రాజమహేంద్రవరం,
5—8—17.

బ్రహ్మశ్రీ వే॥ గోపాలదాసుగారికి సా॥ వ॥ మీ యుత్తరము రాకమునుపే బ్రహ్మశ్రీ॥ వే॥ కా॥ బ్రహ్మయ్య శాస్త్రులగారివల్లను మరియింకొక స్నేహితునివల్లను చి॥ కృష్ణమూర్తి స్వర్గస్థుడాయెనను నతిసంతాప కరమయిన వార్త తెలిసినది మాకీ వార్త కలిగించిన దుఃఖమింతింతని చెప్పనలవికాదు సమాచారము విన్నవెంటనే నాభార్య బొట బొట కన్నీరు కార్చినది. మాకేయిట్లుండగా తల్లిదండ్రులైన మీకున్ను భార్యకును అవ్వకును యెట్లుండవలయునో నూహించుటకు గూడ నాకలవిగాకున్నది మీయందరికిని ఆశ్రయమైయుండినవాడతడొకడే గుణములను బట్టి చూతమా సుగుణములరాశి ?

దుర్గుణము వెదకిచూచినను ఒక్కటిగూడ కనబడదు. ఇట్టివానిని పోగొట్టుకొనుట విధికృతమైయున్నది. ప్రతిదినము మీకు పుత్రము వ్రాయవలయునని కాగితము పేనాతీసికొని ఏమియనుతోచక దుఃఖముతో నిండినవాడనై వ్రాయుట మానినాను ఏమి యాశయున్నదని దానిని చూపి మిమ్ముల నోదార్చగలను. జ్ఞానవంతులైన మిమ్ములను నేనా ఓదార్చుటయనితోచి ధైర్యముగా నేటిరోజున పత్రం వ్రాయుచున్నాను. మీకు తెలియని అంశములు లేవు కర్మబద్ధులై యుండునంతవరకును ఇట్టి దుఃఖములు తప్పవు మీరు గుండె రాయి చేసుకొని దుఃఖమునందు మునిగియుండు మావదినగారికి మీకోడలికి అవ్వగారికి ధైర్యము కొంతకలుగజేసి వారి దుఃఖమును తగ్గించుట మీవంతైయున్నది వారికి వేరుదిక్కులేదు ఇట్టిస్థితిలో మీరు ధైర్యమును విడువ గూడదని నావిన్నపము.

ఇట్లు సాష్టాంగ నమస్కారములు.

యం. లక్ష్మీనారాయణవ్రాలు.



శ్రీ వేదమూర్తులయిన బ్రహ్మశ్రీ ముట్నూరి గోపాలదాసుగారి సన్నిధికి—

తమమిత్రుడు గోడవర్తి జగన్నాథస్వామి నమస్కారపురస్సరముగా వ్రాయునది.

మన శివరామకృష్ణయ్య కృష్ణసాన్నిధ్యమునకై మనల నందరను విడచినాడని విని మిత్రవియోగమువలన దుర్భర వ్యసనము నొందితిని. ప్రహ్లాదునివలె పరమపురుషుని సదాభక్తిశ్రద్ధలతో సేవించుచు పితరులయెడల దృఢమయిన విశ్వాసముతో కైంకర్యమువలన తుష్టిపొందించుచు, గురువులయెడల నమ్రుడైసదా వారివలన నీతినిగ్రహించుచు, అధికారుల పనులు తనవానికంటె ప్రప్రథమమున నిర్వర్తించి వారిమనసు కరగించుచు, వారివలన గౌరవమును మెప్పునుపొంది అఖిలకాలములో సర్వజనానురాగము సంపాదించి తనజీవితము సార్థకపరచుకొని, యశఃకాయతనుజెంది ఈలోకబాధలనుండి తొలగిశాశ్వతానందమునుపొందుటకేకదా మనలను విడచుట ఇట్టియానందమున కాతడు తగియుండుటలో నేమియాశ్చర్యమున్నది తమరు

నుదైవభక్తినికలిగి సదాకృష్ణునిపై యావద్భారము
ను వైచినవారుకావున ఈవియోగమునుసహింతురని నమ్ముచున్నాను ఎంతధైర్యము కలవారికైనను
జ్ఞానమువలన కొంతకొంతస్థైర్యము కలిగినను దేవా
సంబంధములుస్మరణకు వచ్చినప్పుడును మనోవ్యాపారములు బలపడినప్పుడు దుఃఖముపొర్లుచుండును
ఇదిసహజము గనుక ఇట్టిదుఃఖమునకులోనైయున్న
మనలను మన శివరామకృష్ణుడు కొరతలేనిసౌఖ్యమును పొందుచున్నాడని స్మరించి మనమనస్సుకు
దృఢపరచుకొనయత్నింతుముగాక.

కాకినాడ,<br>17.—2—18. } ఇట్లు విన్నవించు మిత్రుడు,<br>గో॥ జగన్నాథస్వామి.

---

బ్రహ్మశ్రీ శ్రీ వేదమూర్తులయిన ముట్నూరి గోపాలదాసన్నగారి సముఖమునకు—

అనుజుడు కాశిభట్ల బ్రహ్మయ్య నమస్కార పూర్వకముగా బంపుకొను పరామర్శవాక్యములు.



జ్ఞానివర్యా!

మీప్రియపుత్రుడు స్వర్గస్థుడాయెనని విని చాలచింతింపుచుంటిని ఈదారుణవార్తవిన నస్మదాదులకేదుఃఖమపారముగా వచ్చుచున్నప్పుడు అతనినిగని పెంచిప్రాజ్ఞునిజేసిన మీకెంతదుఃఖముండునో చెప్పవలవిగాదు. మీకుబుత్రవియోగముమాత్రమే కలుగలేదు. గుణరత్నములఖని నొక్కదానిని మీరుగోలుపోయియున్నారని చెప్పవచ్చును ఆలోచింప నీనష్టము మీకుమాత్రమే కలుగలేదు మనపట్టణమునకును మనదేశమునకును గూడ ఆతనివియోగము గొప్పనష్టమును గలిగించినదనుటకు సందియములేదు అతని నించుకయైన నెఱింగియున్న వారెల్లరును నాతనిమరణవార్తవిని పరిపరివిధముల దుఃఖించుచున్నారు లోకములో గుణవంతులైన పుత్రులు కల్గుటకష్టము అట్టివారు కలిగినను బ్రయోజకులగుట దుర్ఘటము మీవానికన్నో సుపుత్రునకుండవలసినలక్షణములన్నియుబట్టినవి తెలివితేట యోగ్యత వానియందు వర్ణనీయమగు స్థితిలోనుండెను ఇన్ని సుగుణసంపత్తులనిచ్చిన దైవమేలనో గాని చిరాయువును మాత్రమిచ్చినాడు కాడు

"సుకృతీగతాయుః" అనునది లోకవిదితమే కదా గుణవంతుఁడై బ్రియోజకుడై భయభక్తులతోఁ బితృపూజ నిత్యమును నొనరించు నేకపుత్రుఁడు మంచితరుణసమయమున దివి కేగినప్పుడు మీకుఁగలిగిన దుఃఖమునకు మితియెట్లుండును? దాని నుపశమింపజేయు మార్గమెక్కడనుండును? మీయట్టి పరమభాగవతోత్తములకు రాఁదగిన యాపత్తు కాదిది భారతీరత్నమా, నా పామరత్వమునంతను మీయందారోపించి యేమేమో వ్రాయుచుంటిని. సుజ్ఞాననిధుఁగు మిమ్ము నేయోదార్చుటకు మార్గము లేకున్న నీక మార్గముండుటెక్కడ? ప్రజ్ఞాననిధీ, సంసారముయొక్క యసారత మీ రెఱుంగనిది కాదు.

"ఋణానుబంధరూపేణ పశుపత్ని సుతాలయాః
క్షీణే జీర్ణే లయంయాంతి కాతత్ర పరివేదనా" ॥

అను నుపదేశవాక్యము మీకు గ్రొత్తది కాదు. మీరు లోకమునకు జేయు నుపదేశములలో నిది యెక్కటియేయున్నది, సానుభూతితోఁ గూడిన మీ పరిజ్ఞానమునకు వన్నె తెచ్చుటకై సర్వజ్ఞుఁడగు భగవంతుడీపుత్రవియోగమును మీకు గలిగించినాడు. లేకున్న మీ యమాయకత్వమున కీదుఃఖము కలుఁగఁదగినదా!



కాదు. కాన మీధైర్యమును జూపుటకిది మంచితరుణము మీవాడు పామర మృతినంది యుండలేదు. అతఁడు మృతిజెందినను భక్తిజ్ఞానసంపన్నతచే బ్రహ్లాదునివలె శాశ్వతకీర్తి నంది యెల్లరహృదయముల జీవించియే యున్నాఁడు తన సుచరిత్రయను బుత్రికను మిమ్మును లోకమును గూడ నోదార్ప నిచట విడచి తాను స్వర్గతినందినాఁడు తాను బొందఁదగినదేదో యది పొందినాఁడు లోకమున విడువఁదగినదేదో యది యిచట విడచినాఁడు ఇట్టివానిం గూర్చి విచారింపనేల? ఓ తత్త్వజ్ఞాననిధీ! అతఁడు మనకోదార్పును ధైర్యమును గలిగించుటకై మనకడ విడచిన యాతని సాధుచరిత్రమును దలఁచుకొని దానిని సువర్ణశోభితజేసి చూచుకొని చూచుకొని ధైర్యమునందుఁడు కీర్తిశేషులైన పుత్రులవిషయమున విజ్ఞులగు పితలు చేయవలసినపని యిదియే అపరప్రహ్లాదుఁడైన మీపుత్రుని చరిత్రము మీకు దుఃఖశాంతిని గలిగించును లోకమునకు జాలవరకు మార్గదర్శకమగును ఆతని పావన చారిత్రయును బ్రకటించు మార్గమున మీరు దుఃఖశాంతిని జేసికొందురని విని మీవిజ్ఞతవిఱుఁదగిన పని జరుగుచున్నదని తలం

చుచున్నారు. ఈశ్వరుడు దానిని గొనసాగించుగాక.

కాశీభట్ట బ్రహ్మయ్య.

---

Pittalavemavaram,

24—8—17.

My Dear T. N rasinham Bavagaru.

ముట్నూరి గోపాలదాసుగారికి కలిగిన ఆపత్తును గురించి వ్రాయుటకు చేతులు రాకున్నవి ఆయన కుమారుడు వరప్రసాదిగదా? అట్టిమహానుభావుడు ఆయన గర్భమున జన్మించి కొంతకాలము యీ ప్రపంచకమందు పురుషనాటకము యధావిధిగా జర్పి అయన తిరిగి అవతారముదాల్చి నారుగాదా! సరియైన పురుషజన్మమనగా ఆయనది అంతమంది కాకినాడబస్తీలో అనగా యీకలియుగములో కొనియాడబడిన అవతారకుడు అస్తమించినాడుగదా? శ్రీ గోపాలకృష్ణమూర్తివారు గోపాలదాసుగారి గర్భమున యీవిధముగా అవతారము దాల్చినాడనే



నానమ్మకము. అట్టి యవతారము యీకలియుగ మాయయందు మనము గానలేకపోతిమిగాని ఆయనను గోపాలదాసుగారు యెరిగియుందురు. గనుకనె వాని 12 దినములైన వెంటనే అనగా నెలదినములలోపలనే ఆమహానుభావుని పెద్దకుమారుని వుత్సవములు ప్రారంభించినారట (అనగా శ్రీకృష్ణజన్మవుత్సవములనుట) గోపాలదాసు గారవగా ఆదిమూర్తిగాని వెరొండుకాదు. గోవిందం బావగారి చర్యలు భక్తవిజయంలో భక్తచర్యలనవలసినవి. అవతారకుడు. ......... శ్రీమామగారికి గోపాలదాసుగారికి. అనేక వందనములని మనవిచేయకోరుతాను.

చిత్తగించవలెను.

తురగా వెంకట్రామయ్య.



# శుద్ధపత్రిక.

| పేజీ | పంక్తి | తప్పులు. | ఒప్పులు. |
|---|---|---|---|
| 9 | 16 | కాంతి | శాంతి |
| ,, | 20 | పీవిజ్ఞతవికు | వీూవిజ్ఞతకు |
| 10 | 12 | యూప్రపం | యీూప్రపం |
| 5 | 16 | శీతకరణో | శీతకిరణో |
| 7 | 9 | తేఘు | తేష్షు |
| ,, | ,, | జననమం | జననం |
| 8 | 2 | శతుర్థాం | చతుర్థాం |
| ,, | 20 | వాంసు | పాంసు |
| | | వుచ్చై | ఉచ్చై |
| 9 | 8 | మహో | మనః |
| 1 | 10 | జాన | జ్ఞాన |
| 11 | 4 | మనుంషు | మనుజుండు |
| 20 | 15 | ననీనిదాం | ననిందాం |
| 21 | 4 | తర్తించె | వర్తించె |
| 31 | 2 | లంపన్ | సింపన్ |
| 32 | 10 | యుండిరి | తరువాయి |
| | | (ముఖప్రీతిస్త | వములనుట) |
| 3 | 14 | వాకిటో | వాకిట్లో |
| 44 | 18 | జోతిశాస్త్ర | జ్యోతిశ్శాస్త్ర |

ఓం తత్సత్.

శ్రీ గురుభ్యోనమః

# అక్షర ప్రహ్లాదుడు ముట్నూరి శివరామకృష్ణయ్య జీవితము రెండవభాగము.

## —♦ శ్రీకృష్ణప్రార్థన ♦—

శ్లో॥ కృష్ణకృష్ణ కృపాసింధో భక్తసింధు సుధాకర
మాముద్ధర జగన్నాథ మాయా మోహామ
హార్ణవాత్॥

## భక్తశ్రేణి ప్రార్థన.

శ్లో॥ ప్రహ్లాదనారదపరాశర పుండరీక వ్యాసాంబరీష
శుక శౌనక భీష్మ దాల్భ్యాం। రుక్మాంగ
దార్జున వశిష్ఠ బిభీషణాది పుణ్యానిమాం
పరమ భాగవతాం స్మరామి॥

ఈ గ్రంథమునందు వ్రాసియున్న పరమధర్మము
లన్నియు సంపూర్ణముగా ప్రవర్తించి చూపిన
మహానుభావులు.

సుజన వరేణ్యులారా! వుభయవేదాంత ప్రవర్త
కులారా! భగవద్భక్తులారా!

ఇందు వ్రాయబడిన యమనియమాది భవ్యగు

ణములు మనయందు వుండ చూచుకొని అటుపై భగవంతుని భావించి సేవించవలయును. అవివేక చేయు నుపాసనాయోగములు పథ్యములేని యౌషధసేవలు వంటివిగా నెన్నబడును. మాశివరామకృష్ణుడు ఈశ్వరానుగ్రహమువలన యమనియమాది యనంతకళ్యాణగుణగణ ప్రవర్తనుడై సాధుసజ్జనుల హృదయములయందు నిత్యముతలంపునకు వచ్చుచు వారిచే యపరప్రహ్లాదుడని పేరుంబడసి కీర్తిశేషుండై శ్రీవైకుంఠనగరమునందు తిరిగిప్రవేశించినాడు. పూర్వజన్మమందు నేనువాడు హిరణ్యకశ్యపప్రహ్లాదులము. తిరిగి యీజన్మమం దిట్లుగా మేముద్భవించుటకు కించెత్తు కారణముండి పుట్టినాము. యీకారణమేదన వినుండు. మున్ను హిరణ్యకశపుడనైన నేను భేదవృత్తితో శివభక్తుడనై రాక్షస కృత్యములతో సంచరించు చుండగా బ్రహ్మాంశముగల వీడు నాపుత్రుడై ప్రహ్లాదుడను నామముతో విష్ణుభక్తి పరాయణుడై మంచిగానాతో నారాయణ మహిమాతిశయములు నవ్వారిగాప్రసంగించు చుండ నేను పాషండమతముతో వానిపై పగబూనివాని ననేకప్రకారములుగా బాధించి శిక్షించిన వాడనై తుదకు



వ్యర్థమనోరథుడనై నరశింహునిచే గిట్టడమైనది. అప్పట్లో వీడు నాకు వ్యతిరిక్తునివలె సర్వవేళల కనబడుచు రాక్షస కృత్యములైన నాయాజ్ఞలనగా అన్యత హింసాదులను నిషేధించి తండ్రినైన నాకు విదూరుడై జనకునితో విరోధమును దాల్చినాడని జనులచే తేనిపోని యపఖ్యాతి నొకటి వాడు పొంది యుండుటచే నాయపఖ్యాతిని తొలిగించుకొనుటకై తిరిగి త్రిమూర్తులను ప్రార్థించి వారి సెలవుమీద మేముభయులము యీజన్మమందు పూర్వమువలె తండ్రి కుమాళ్లమై విధికృతము వలన మా వుభయులకునునపటివలెగీతలలో చెప్పినచొప్పునదైవాసుర సంపద్విభాగము విభజించియందు దైవసంపద వానికిని యసురసంపత్తు నాకును యివ్వబడి యీమర్త్యలోకమందు మేమట్లనేప్రవర్తించుచువానిజన్మాంతర పుణ్య పరిపాకముచే ముందు వ్రాయబడిన యనంతకల్యాణగుణములు వానియందు హెచ్చుగా ప్రవర్తింపబడి వాడుపెద్దల యాశీర్వచన ప్రభావము వల్లను దైవానుగ్రహమువల్లను నారాయణాంశము గలవాడై శ్రీవైకుంఠ నగరమునుండి యీలోకమునకు రాబడి మావుభయుల గర్భమందు ప్రవేశించి

క్రమముగా నావిర్భవించి శివరామ కృష్ణ గోవింద నామాభిధానుడై సజ్జనులచే యపర ప్రహ్లాదుండని పేరుపొంది భక్తిజ్ఞాన వైరాగ్య భాగ్యసంపదను సంపాదించుకుని తల్లిదండ్రులమైన మమ్ము (మాతృదేవోభవ పితృదేవోభవ ఆచార్య దేవోభవ) అను శ్రుతివాక్య ప్రమాణములననుసరించి భావించుచు సత్యవంతునివలె సదామమ్ముల పూజించుచు శ్రీరామ చంద్రునివలె పితృవాక్య పరిపాలన గావించుచు అంబరీష హారిశ్చంద్ర ప్రవరాఖ్యులవలె యేకపత్నీవ్రత నిష్టతో సంచరించుచు ప్రహ్లాద నారదాదులవలె పరిపూర్ణభక్తిగలవాడై శివసనకాదులవలె పరమవైరాగ్యముతో శ్రీకృష్ణ జనక భీష్మాదులవలె దివ్యజ్ఞానపముతో వశిష్టమార్కండేయులవలె పరమ శాంతితో శ్రీఅవధూత దత్తాత్రేయ అజగరుల వలె ప్రియాప్రియ శీతోష్ణాది ద్వంద్వములను సహించుచు అజాత శత్రునివలె అనగా ధర్మరాజువలె సర్వజన ప్రియుడై యీలోకమందు 23 సంవత్సరముల 5 మాసములు మాయొక్క గోపాల మందిరములో భగవద జనలు పూజలు యోగాభ్యాసాదులు నాట్యములుకొరంత లేకుండా సర్వజనులు జూచుచుండ



నాపరీక్షకు అందినవాడై అందరికిని ముద్దుగా గోచరించి తానువచ్చినపని అయినదని రేపుపోతాడనగా నాతోరహస్యముగా చెప్పినవాడై శ్రీగోవిందనామమును స్మరించుచు తిరిగి శ్రీవైకుంఠనగరమును గూర్చి వెళ్ళినవాడాయెను.

వీని జాతకమునందిట్లుగా వ్రాయబడివున్నది.

శ్లో॥ భాగ్యస్థానే గతేమందే వైకుంఠ దాగతోనరః
రాజ్యం కృత్వా మహీన్ భుక్త్వా పునః
స్తత్రైవగచ్ఛతి॥

అనివుండుటచే శ్రీకోటకామ శాస్త్రిగారు యీ ప్రకారము యిందు శ్రీనారద ప్రశ్నోత్తర సంవాదముగా ఒకశ్లోకమును వ్రాసి నాకుపంపినారు. ఆశ్లోకమును యిందు వ్రాయుచున్నాను చూడండి.

శ్లో॥ దేవర్షే క్వనుయాసి వాసవభువం చేత్తత్రినారా
యణో దృష్టస్తేశ్శృణు సావధాన మనసావక్ష్యే
సురాధీశ్వర। శ్రీముట్నూరి కులాబ్ధిశీతకరణో
శివరామ కృష్ణాఖ్యత స్సోయం జాతఇతిశ్రుతా
హి బహుళ స్సోకిం వదంతీ మయ॥

అని యీప్రకారము పెద్దలచే శ్రీవైకుంఠవా

సుని కళగా నెన్నబడినాడు. వీని బాల్య యవ్వన చరిత్ర మొదటిభాగమునందు వ్రాయబడి వున్నది అందుచూడవలెను. ముముక్షువులైన ప్రతిమనుజులు అనగా నిజమైన వేందాంతులు భగవద్భక్తులు సన్యాసులు బ్రహ్మచారి బావాజీలు ముఖ్యముగా తమయందు సర్వదా చూచుకోవలసిన యమనియమాది సద్గుణములు అనగా శ్రీభగవదాజ్ఞలుగా త్రిశిఖి బ్రాహ్మణో పనిషత్తునందున దర్శనో పనిషత్తునందున శాండిల్యో పనిషత్తునందున సూత సంహిత వేదాంత గ్రంధమాల మాటప్రదీపికాదుల యందున మిక్కిలి సర్వోన్నతముగా జెప్పబడియున్న అష్టాంగ యోగములలో అత్యంత పథ్యములుగా నెన్నబడిన యమనియమాది భవ్యగుణములు మా శివరామ కృష్ణుడు ప్రవర్తించి పెద్దలకు చూపినాడు అవియే యిందు ముఖ్యముగా విన్నవించు కొనుచున్నాను చక్కగా చూడండి.

శ్లో॥ అహింసా సత్య మస్తేయం బ్రహ్మచర్యందయా
ర్జవం । క్షమాధృతి ర్మితాహార శౌచంచేతి
యమాదశ ।



శ్లో॥ తపస్సంతుష్టి రాస్తిక్యం దాన మారాధనం
హరేః । వేదాంత శ్రవణం హ్రీశ్చ జపపూ
జాది లక్షణం॥

అని త్రిసిఖిబ్రాహ్మణోపని షత్తువక్కాణించుచున్నది. ఇట్లుగానే శాండిల్యో పనిషత్తునందున

శ్లో॥ అహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్య దయాజవక్ష
మాధృతి మితాహారశౌచానిచేతియమాదశ॥

తత్రాహింసా నామమనోవాక్కాయ కర్మభి సర్వభూతేషు సర్వదా క్లేశాజననమం। సత్యం నామమనోవాక్కాయకర్మభిభూత హితయదార్థాభి బాషణం (సత్యమే వజయతి) అస్తేయం నామ మనోవాక్కాయ కర్మభిః పరద్రవ్యేషు నిస్పృహా। బ్రహ్మచర్యంనామ। సర్వావస్థాషు మనోవాక్కాయ కర్మభీ నర్వత్ర మైథున త్యాగః। దయానామ। సర్వభూతేషుసర్వత్రానుగ్రహః। ఆర్జవంనామ। మనోవాక్కాయ కర్మణాం విహితా విహితేషు జనేషు ప్రవృత్తౌ నివృత్తౌవా యేక రూపత్వం! క్షమానామ! ప్రియా ప్రియేషు సర్వేషు తాడన పూజనేషు సహనం। ధృతిర్నామ అర్థహానౌ శ్రేష్ఠబంధౌ।

వియోగే తత్ప్రాప్తౌ సర్వత్ర చేతస్థాపనం మితాహారంనామ। శతుర్థాంశావసేమక శుస్నిగ్ధ మధురాహారః। శౌచన్నామ। తద్ద్వివిధం। బాహ్యమాంతరంచేతి తత్ర మృజ్జలాబ్యాం భాహ్యం। మనశ్శుద్ధిరాంతరం! తదధ్యాత్మ విద్యయా లభ్యం॥

శ్లో॥ తపస్సంతో షాస్తిక్యం దానేశ్వర పూజన ।
సిద్ధాంత శ్రవణ హ్రీమతి జపవ్రతాని దశని
యామాః ॥

తత్రతపోనామ। విధ్యుక్త కృచ్ఛ్ర చాంద్రాయణాదిభి శ్శరీరశోషణం! సంతోషోనామ। యదృచ్ఛాలాభ తుష్టిః। ఆస్తిక్యన్నామ। వేదోక్త ధర్మాధర్మేషు విశ్వాసః దానంన్నామ న్యాయార్జిత ధనదాన్యాదేః శ్రద్ధయా ర్థిభ్యః ప్రదానం। ఈశ్వరపూజనం నామ ప్రసన్న స్వభావేన యథాశక్తి విష్ణురుద్రాది పూజనం। సిద్ధాంత శ్రవణంనామ వేదాంతార్థవిచారః। హ్రీన్నామ వేదలౌకిక మార్గవుచ్ఛ్రిత కర్మణి లజ్జా, మతిర్నామ। వేదవిహిత మార్గేషు శ్రద్ధా, జపోనామ విధివద్గురోపదిష్ట వేదావిరుద్ధ మంత్రాభ్యాసః। సద్ద్వివిధః। వాచికో మానస శ్చేతి పాంసుభేదేన। వుచ్చైరుచ్చారణం యథోక్త ఫలం।



ఉపాంసు సహస్రగుణం మానసం కోటిగుణం। వ్రతన్నామ, వేదోక్తవిధినిషేధానుష్టాననైయత్యమితి॥

ఇంక శంకర యెతీంద్ర కృతవేదాంత గ్రంథము లయందు చెప్పిన (మనః ప్రసాధ సాధనములు చూడండి.

మనఃప్రసాద సాధనములు.

మూ॥ మనఃప్రసాదసిద్ధ్యర్థం సాధనం శ్రూయ
తాం బుధైః । మనఃప్రసాదోయత్సత్త్వే
యదభావే నసిధ్యతి ॥

తా॥ ఎయ్యదియున్నయెడ మనస్సు నిర్మలమగునో, ఎయ్యదిలేకున్న మనస్సు నిర్మలముకాదో, అట్టిసాధనము చెప్పఁబడు

మూ॥ బ్రహ్మచర్య మహింసాచ దయాభూతే ష్వ
వక్రతా । విషయేష్వతివైతృష్ణ్యం శౌచం
దంభవివర్జనం ॥

మూ॥ సత్యంనిర్మమతా స్థైర్య మభిమానవిసర్జ
నం । ఈశ్వర ధ్యానపరతా బ్రహ్మవిద్భిస్స
హస్థితిః ॥

మూ॥ జానశాస్త్రిక పరతా సమతా సుఖదుఃఖ
యోః। మానానాసక్తి. రేకాన్తశీలతాచ
ముముక్షుతా ।

మూ॥ యస్యైతి ద్విద్యతే సర్వం తన్యచిత్తం ప్రి
సీదతి । నత్వేతద్ధర్మశూన్యస్య ప్రికారాన్తర
కోటిభిః ।

తా॥ బ్రిహ్మచర్యము, అహింస, భూతదయ, ఆవక్రిత (వంకరదనములేమి) వైరాగ్యము, పరిశుద్ధి, దంబములేమి, సత్యము, నిర్మలత్వము, నిశ్చలత్వము, నిరభిమానము, ఈశ్వరధ్యానపరత్వము, బ్రిహ్మవిదులసాంగత్యము, జ్ఞానశాస్త్రమునందే యాశక్తి. సుఖదుఃఖములయందు సమత్వము, గౌరమునందాసక్తి లేకుండుట, విజనప్రిదేశమున నుండుచుండుట, ముముక్షుత్వము, ననునీపదునెనిమిది ధర్మంబులు నెవ్వనికి నుండునో, వానికి చిత్తశుద్ధిగలుగు గాని, యిపలేక, యితరవిధములగు ధర్మములు కోటియుండినను చిత్తశుద్ధికలుగనేరదు, శ్రీభారతశాంతిలో

వ॥ అనినవిని ధర్మతనయుండు దేవవ్రతునితో నెట్టివాఁడు సుఖియును మంగళవంతుండును నిర్భయుండునునై వర్తించునని యడిగిన నప్పుడమితేని కప్పు



రుషవరుండిట్లను దమసంపన్నునకు నీవుచెప్పినచందంబులు గలుగు వానినాకర్ణింపుము.

తా॥ అనిచెప్పఁగావిని ధర్మజుండు భీష్మునితో నెట్టిమనుండుసుఖియును, శుభముగలవాడును, నిర్భయుండునగు నెఱింగింపుమనఁగా నాతనికి భీష్ముండిట్లనియె. బహిరింద్రియములం జయించిన వానియందు నీవుచెప్పిన గుణంబులుండును వానిక్రిమంబువినుము.

గీ॥ సర్వవర్ణాశ్రిమములకు • శమముదమము । గలిగి
యునికి విశిష్టప్రి • కారమగుట। బ్రాహ్మణునకు
విశేషించి • రాజవర్య । దమసమాహిత వృత్తి
పె • ద్దయును వలయు॥

తా॥ రాజేంద్రా! నాల్గు జాతులవారికిని, నాలుగాశ్రిమములవారికిని బహిరంతరింద్రియములు గెలుచుట ముఖ్యకార్యమై యున్నను, బ్రాహ్మణులకు మాత్రము బహిరింద్రియములు చక్కఁగా జయించుట ప్రధానము.

వ॥ దమంబు సద్గుణంబులరాశి యనియెయ్యావి యంటేని.

సీ॥ శౌచమక్రోధంబు ♦ సంతోషమార్జవ మనసూ
యవిగతద్రై ♦ న్యపవృత్తి । యపరిమాదంబు
దు ♦ దురభిమానరాహిత్య మతివాదవర్జన మ
ఖిలభూత । దయగురు పూజనిం ♦ దాస్తుతిపరివ
ణతా త్యాగంబపైసున ♦ త్వంబుసాధు । జన
సంగమంబమృ ♦ షాభిభాషణము నిస్పృహతయ
హింసను ♦ శీలభావ ।

గీ॥ మింద్రియగ్రామ జయమివి ♦ యెల్లదమము।
నాకృతులు వీనిగలపుణ్యు ♦ డభయుడైహి।
కములవలసను నాముష్మి ♦ కములవలన।
శాంతిమంగళనిధిబోధ ♦ శౌఖ్యమూర్తి॥

తా॥ శుచియు, కోపము లేకుంటయు, సంతోషము, సదాచారము, అసూయ లేకుంట, దీనుడు కాకుంట జాగ్రితతో మెలగుట, గర్వము లేకుంట, పెలుచుగా మాటలాడకుంట, సర్వభూతములయందును దయగలుగుట, గురుపూజ, నిందను స్తోత్రమును వినకుండుట, లుబ్ధుడుగాకుండుట, సజ్జనులతో గూడుట, అబద్ధమాడకుండుట, నిరాశయు, అహింసయు, మంచిమనస్సు, ఇంద్రియజయమును అనునీగుణములెల్ల దమస్వరూపములు. వీనింగల పుణ్యుండు



నిర్భయుడై, ఇహాపరసౌఖ్యములకు నర్హుడై, శాంతిని శుభములకును నెలవై, జ్ఞానమును సౌఖ్యమును గలవాడగును. ఇంకయీలోకమందు

వ॥ సదోప నాసియగు సదాబ్రహ్మ చారియు నమాంసభోజియు విఘసాశనుండును నమృతాసియు నస్వప్నుండును గావలయు దత్స్వరూపంబు లెట్టి ఎంటేని,

తా॥ సదోపవాసియగు (ఎల్లప్పుడుపవాసముచేయువాడును.) సదాబ్రహ్మచారియు (ఎల్లప్పుడుబ్రహ్మచారియు) అమాంసభోజియు (మాంసము భుజింపనివాడును) విఘసాశనుండును (భోజన శేషముందినువాడును) అమృతాసియు (యజ్ఞశేషమును భుజించువాడును) అస్వప్నుండును (స్వప్నము నెఱుంగనివాడును కావలయును.) తత్స్వరూపంబు లెట్టివని యడిగితివేని జెప్పెద.

సీ॥ ఇరుప్రొద్దుగుడుచుచు ♦ నెడనెడగుడువక యుం
డ నాతండు స ♦ దోపవాసి । ఋతుకాలమున
నాత్మ ♦ సతియందు రతిసల్పు భవ్య శీలుడు
సదా ♦ బ్రహ్మచారి । దేవపితృతిథిపూ ♦ జావి
ధులందిడి మఱిసంజుపురుషుడ ♦ మాంసభోజు

తనయట్లుపఙ్క్తిక వా ♦ రనుభుజింపభుజించునంచి
తాత్ముడువిఘు ♦ సాశనుండు॥

గీ॥ భృత్యవర్గంబుగుడిచిన ♦ పిదపగుడుచు । నాత
డమృతాశిదివసంబు ♦ నందునిదుర । పోనిపు
ణ్యుడస్వప్నుడీ ♦ పాలములగుమ । హోధికవ్రత
ములు దేహ ♦ బాధకములు॥

తా॥ రెండుపూటలు మాత్రమేభుజించి నడుమ నడుమ భుజింపకుండువాడు సదోపవాసియు, ఋతు కాలములందుమాత్రమే తనభార్యతో గూడుచు నియతితోనుండువాడు సదా బ్రహ్మచారియు, దేవ పితృదేవ బ్రాహ్మణ భోజనములకు బిమ్మటభుజించువాడు మాంసభోజియు, తనవలెనే తనతోడభుజించు వారికెల్ల దృప్తిచేయునాతండు విఘసాశనుండును, పరిజనులుంగూడ భుజించినిపిమ్మట భుజించు వాడమృతాశియు, పగలునిద్దురపోని పుణ్యాత్ముండస్వప్నుండునునగును. ఇట్టిమహావ్రతములు దేహమునకు బాధచేయును. ఇట్లుయువ్వనమందు ప్రవర్తించినాడు.

ఇంక శ్రీభాగవతమునందు మాయనుగెలిచే
భక్తునటన ప్రకరణము వినుండు.

ఉ॥ జ్ఞానవిహీనమయిన నరసంఘము గానగరాని



మాయదాలోన నడంచియట్లు హరిలోకముజెందు
దురంతయున్ దగన్యూనతసత్యవాక్యగుణ భూషణ
యిక్కథ వేడ్కతోడుత మ్యూనక జెప్పుమన్నను
బ్రబుద్ధుడు నిట్లనె గారవంబునన్॥ వ॥ సూర్యోదయాస్తమయంబులన్ బ్రతిదినంబు నాయు వృక్షయంబునొంద దేహిదేహ కళత్రమిత్ర భ్రాతృమమత్వ పాశబద్ధుండయి విడివడు నుపాయంబు గానక సంసారాంధకారమగ్నుండయి గతాగత కాలంబుల నెరుంగక దివాంధంబులగు జంతు జాలంబుల భంగి జన్మజరారోగ విపత్తి మరణంబులందియు శరీరంబే మేలనుచు బ్రమోద మోహామదిరాపానమత్తులయి విషయాసక్తంజుక్కితమ్ముందా రెరుంగక యుండి విరక్తిమార్గంబుదెలియక వర్తించుమూఢులగు జనంబులపొంతలం బోవక కేవల విష్ణుభక్తి భావంబుగల సద్గురులం భజియించి సాత్వికంబును భూతదయయును హరికథామృత పానంబును బ్రహ్మచర్యవ్రతంబును విషయంబుల మనంబు జేరకుండుటయు, సాధుసంగమంబును సజ్జన మయిత్రియు వినయసంపత్తియు శుచిత్వంబును తపంబును వేదశాస్త్రాధ్యయన తద్ధర్మానుష్టానంబును నహింసయు సుఖ

దుఃఖాదిద్వంద్వసహిష్ణుతయు నీశ్వరుని సర్వగతుని గా భావించుటయు ముముక్షుత్వంబును జనసంఘవర్జనంబును వల్కలాదిధారణంబును యదృచ్ఛాలాభ సంతుష్టియు వేదాంత శాస్త్రార్థజిజ్ఞాసయును దేవతాంతరనిందాపవర్జనంబును గరణత్రయశిక్షణంబును సత్యవాక్యతయు శమదమాదిగుణవిశిష్టత్వంబును గృహారామక్షేత్ర కళత్ర పుత్ర విత్తాదులు హరికర్పణంబు సేయుటయు నిరాదరదర్శనవర్జనంబు సేయుటయు భాగవతోత్త ధర్మంబులని చెప్పి ఇట్లనియె॥ క॥ హరిదాసుల మిత్రత్వము మురరిపుకథ లెన్నికొనుచు మోదముతోడ స్ఫురితాశ్రుపులకితుండయి పురుషుడు హరిమాయ గెల్చు భూపవరేణ్యా॥ అని పరమ భాగవతోత్తమ ధర్మంబులు చెప్పియుండిరి. ఇవన్నియు మా కృష్ణుడు కొరంతలేకుండ వర్తించిచూపినాడు.

ఇంక నిజమైన జ్ఞాని వేదాంతియొక్క
చిహ్నములు వినుండు.

శ్లో॥ అక్రోధ వైరాగ్య జితేంద్రియత్వం! క్షమాదయా సర్వజన ప్రియత్వం। నిర్లోభ దానం భయ
శోక వర్జనం। జ్ఞానస్య చిహ్నం దశలక్షణాని॥



శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు। సాధుష్వపిచ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥

తా॥ ఉపకారుల యందును, మిత్రుల యందును శత్రువుల యందును, ఉదాసీనుల యందును, విరోధుల యందును, బంధువుల యందును, సాధువుల యందును, పాపిష్ఠుల యందును, సమబుద్ధి గలవాడు యోగారూఢులలో శ్రేష్ఠుడని చెప్పబడుచున్నాడు. అని శ్రీకృష్ణపరమాత్మ పలికియున్నాడు.

ఇట్లుగాను శ్రీనారద పరివ్రాజకోపనిషత్తునందున జీవన్ముక్తి ప్రకాశిక యందున చెప్పియున్న సంతరింద్రియ జ్ఞానేంద్రియ అజిహ్వా షండకత్వాది ధర్మములతో ప్రవర్తించుచు సర్వులచే శ్రీశుకదేవులనియు అపరధర్మాంగదుడనియు పేరొంది ప్రకాశించినాడు.

ఇంక అజిహ్వా షండకత్వాది ధర్మములు వినుండు.

శ్లో॥ అజిహ్వః షండకః పంగురంధో బధిర ఏవ చ।
ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుష్షడ్భిరేతైర్న సంశయః॥

తా॥ బ్రహ్మవేత్తయగు సన్యాసి నాలుకలేనివాడుగా, పుంస్త్వము లేనివాడుగా, కాళ్ళులేనివాడుగా, కండ్లులేనివాడుగా, చెవులులేనివాడుగా, మన

స్పృలేనివాడుగా నుండెనా ఈ ఆరుధర్మముల చేత ముక్తినొందును. యిందుకు సంశయములేదు.

శ్లో॥ ఇదమిష్టమిదం నేతియోశ్నన్నపినసజ్జతే।
హితంసత్యం మితంవక్తితమజిహ్వాంప్రచక్షతే॥

తా॥ భోజనముచేయునప్పుడుయిది ఇష్టము ఇది అయిష్టము యిదిరుచిగానున్నది యిది రుచిగాలేదని యెవ్వడుసక్తుడుకాడో భూతములకుహితమై యథార్థమైన వాక్యమును కొద్దిగా చెప్పునో నానన్యాసి అజిహ్వుడనిఅనగా నాలుకలేనివాడని చెప్పబడును.

శ్లో॥అద్యజాతాంయథానారీంతథాషోడశవార్షికీం॥
శతవర్షాంచయోదృష్ట్వానిర్వికారస్సషండకః॥

తా॥ యెవ్వడు యీదినమందు బుట్టిన స్త్రీవ్యక్తిని నూరుసంవత్సరములుగల స్త్రీవ్యక్తిని చూచినప్పుడే ప్రకారముగా చిత్తవికారము లేనివాడై యుండునో నాప్రకారమే పదియారుసంవత్సరములు వయస్సుగల స్త్రీవ్యక్తినిచూచినా నిర్వికారుడై యుండెనా అతడు షండుడని అనగా పుంస్త్వము లేనివాడని చెప్పబడును.

శ్లో॥ భిక్షార్థమటనంయస్యవిణ్మూత్రకరణాయచ।
యోజనాన్నపరంయాతిసర్వథాపంగురేవసః॥



తా॥ యెవ్వడు భిక్షాకాలమందు మాత్రమునడుచుచుండునో మూత్రపురీషోత్సర్గములకున్న బాహ్యదేశమునకు నడుచుచుండునో గ్రామాంతరమునకు వెళ్లవలసియుండెనా ఆమడదూరమునకు పైగా నడువడో అతడు పంగువని అనగా కాళ్ళులేని వాడని చెప్పబడును.

శ్లో॥ తిష్ఠతోవ్రజతోవాపియస్యచక్షుర్నదూరగం
చతుర్యుగాంభువం ముక్త్వాపరివ్రాట్ సోంధ
ఉచ్యతే॥

తా॥ నిలచినప్పుడుగాని నడచునప్పుడుగాని ముందరనుండు నాలుగుబారల పొడవుగల భూమిని విడచిపైగా యెవనియొక్క నేత్రములు ప్రచరించవో నానన్యాసి అంధుడని అనగా కండ్లులేని వాడని చెప్పబడును.

శ్లో॥ హితంమితంమనోరామంవచశ్శోకాపహంచయత్।
శ్రుత్వాయోనశృణోతీవబధిరస్సప్రకీర్తితః॥

తా॥ ఉత్తరకాలమందు శుభమును కలుగచేయునదియు అల్పాక్షరములు కలదియు మనోహరమగునదియు తత్కాలమందుండు శోకమును నివర్తింపచేయునట్టి వాక్యములను వినికూడాయెవ్వడు వినని

వానివలే సంచరించునో నట్టిసన్యాసి బధిరుడని అనగా చెవులులేనివాడని (చెవిటివాడని) చెప్ప బడును.

శ్లో॥ సాంనిధ్యేవిషయాణాంచ సమర్థోఽ వికలేంద్రియః । సుప్తవద్వర్తతేనిత్యంబిక్షుర్ముగ్ధస్సకీర్తితః ॥

తా॥ భోగ్యములైన శబ్దాది విషయములు సన్నిధానమందున్నప్పటికి తాను శబ్దాది విషయములననుభవించుటకు సమర్థుడైయున్నప్పటికి చక్షుశ్శ్రోత్రాద్రీంద్రియములు లోపములేక యున్నప్పటికి యెవ్వడు విషయములను తెలుసుకోక నిద్రించువానివలే నుండునో నతడు ముగ్ధుడని అనగా మనస్సులేనివాడని (మూర్ఖనొందనవాడని) చెప్ప బడును.

శ్లో॥ ననీనిదాంనస్తుతిం కుర్యాన్న కంచిన్మర్మణిస్పృశేత్ । నాతివాదీభవేత్తద్వత్సర్వ త్రైవసమోభవేత్ ॥

తా॥ బ్రహ్మవేత్తయగు సన్యాసి అన్యులను గూర్చి నిందనుగాని స్తోత్రమునుగాని చేయకూడదు అన్యజనులయొక్క రహస్యదోషములు తనకు తెలి



సియున్నా వాటిని బయలుపరచి యెటువంటిమనుష్యునినైనా నొప్పింపరాగదు అధికముగా సంభాషింపతగదు తనయందు విరోధముతోగాని స్నేహముతోగాని తర్తించే జనులందరియందు సమానమైన చిత్తవృత్తికలవాడై యుండవలయును.

శ్లో॥ నసంభాషేత్ స్త్రియం కాంచిత్పూర్వదృష్టాంచనస్మరేత్ । కథాంచవర్జయేత్తాసాంనసశ్యేల్లిఖితామపి ॥

తా॥ బ్రహ్మవేత్తయగు సన్యాసి యెటువంటి స్త్రీతోనైనా సంభాషింపతగదు; పూర్వముచూచిన స్త్రీని మనస్సులో స్మరింపతగదు; స్త్రీలయొక్క సమాచారమును చెప్పకోకూడదు; విశేషమేల చిత్రమందు వ్రాయబడిన స్త్రీనికూడా చూడకూడదు. ఆర్యులారా!

ఈప్రకారము భక్తిజ్ఞానవైరాగ్య చిహ్నములతో నర్తించుచు అంతరింద్రియ బహిరింద్రియ కట్టుబాటులతో వర్తించుచు శ్రీ అజగరప్రహ్లాదులవలె సర్వదా వర్తించినాడు. యెట్లనగా,

అజగరుని ప్రవర్తన వినుండు.

సీ॥ అజినవల్కలదుకూ•లాంబరంబులు గట్టి
యొండెఁ గట్టకయును • నొండె నుండు
నాందోళికారథ•హయనాగముల నెక్కి
యైన నెక్కకయైన • నరుగుచుండుఁ
గర్పూరచందన • కస్తూరికాలేప
మైన భూరజమైన • నలఁదికొండు
ధర్మశయ్యలనైనఁ • బర్ణశిలాతృణ
భస్మంబులందైనఁ • బండుకొండు

ఆ॥ మానయుక్తమైన • మానహీనంబైనఁ
దీయనైన మిగులఁ • దిక్తమైనఁ
గుడుచు సగుణమైన • గుణవర్జితంబైన
నల్పమైనఁ జాల • నధికమైన.

క॥ లేదని యెవ్వరి నడుగను
రాదని చింతింపఁ బరులు • రప్పించినచోఁ
గాదని యెద్దియు మానను
ఖేదము మోదమును లేక • క్రీడింతు మదిన్.

క॥ నిందింపఁ బరుల నెన్నఁడు
వందింప ననేకపీడ • వచ్చిన మది నా
క్రందింప విభవముల కా



నందింపఁ బ్రకామవర్త•నంబున నధిపా.

ఇంక ప్రహ్లాద ప్రవర్తన వినుండు.

సీ॥ తనయందు సకలభూ•తములందు నొకభంగి
సమహితత్వంబున • జరగువాఁడు
పెద్దలఁ బొడగన్న • భృత్యునికైవడిఁ
జేరి నమస్కృతుల్ • సేయువాఁడు
కన్నుదోయికి నన్య•కాంత లడ్డంబైన
మాతృభావము సేసి • మరలువాఁడు
తల్లిదండ్రులభంగి • ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జిం•తించువాఁడు

తే॥ సఖులయెడ సోదరస్థితి• జరపువాఁడు
దైవతము లంచు గురువులఁ • దలఁచువాఁడు
లీలలందును బొంకులు • లేనివాఁడు
లలితమర్యాదుఁ డైనప్ర•హ్లాదుఁ డధిప.

సీ॥ ఆకారజన్మవి•ద్యాఢ్యవరిష్ఠుఁడై
గర్వసంస్తంభనం•గతుఁడు గాఁడు
వివిధమహానేక•విషయసంపన్నుఁడై
పంచేంద్రియములచేఁ • బట్టుపడఁడు
భవ్యవయోబల•ప్రాభవోపేతుఁడై
కామరోషాదులఁ • గ్రిందుకొనఁడు

కామినీప్రముఖభోగము లెన్ని గలిగిన
వ్యసనసంసక్తినా వంకఁబోఁడు
ఆ॥ విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు
వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు
ధరణినాథ దైత్యతనయుండు హరిపర
తంత్రుఁడై హతాన్యతంత్రుఁడగుచు.

మరియుఁ యిట్టి సుగుణరత్నాకరుఁడై పరలోకబంధువులయిన శ్లో॥ సత్యంమాతాపితాజ్ఞానం ధర్మోభ్రాతృ దయాసఖా। శాంతిః పత్నీ క్షమా పుత్రి షడయితేమమబాధవాః॥ అనియున్న ఇట్టి సుగుణ బాంధవులతో గలసి సమస్తభూత హృదయాంబుజవర్తియగు వాసుదేవుని అనగా శ్లో॥ వాసనాద్వాసుదేవస్య వాసితంతే జగత్త్రయం। సర్వభూత నివాసోసివాసుదేవ నమోస్తుతే॥ అనియున్న సచ్చిదానంద పరిపూర్ణపరమాత్ముని ప్రీతికరములయిన

శ్లో॥ అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియ నిగ్రహం। సర్వభూతదయాపుష్పం క్షమాపుష్పం తథైవచ। జ్ఞానపుష్పం ధ్యానపుష్పం షడయితే పుష్పసాజ్ఞికాః అనియున్న కల్యాణగుణ



పుష్పచయముచే నిత్యము యర్చించుచు ఈప్రకారము ప్రార్థించుచు వరములనుబడయుచుండేవాడు.

విష్ణుస్తవము.

శ్లో॥ అవినయ మపనయ విష్ణో దమయమనశ్శమయ విషయ మృగతృష్ణాం భూతదయాం విస్తారయ తారయ సంసార సాగరతః। దివ్యధునీ మకరందే పరిమళ పరిభోగ సచ్చిదానందే శ్రీపతి పదారవిందే భవభయఖేద ఛిదినందే సత్యాపి భేదాపగమేనాథ తవాహంనమామకీనస్త్వం। సాముద్రోహితరంగః క్వచనసముద్రోనతారంగః॥ ఉద్ధృతనగనగభి దనుజదనుజకులామిత్ర మిత్రశశిదృష్టే। దృష్టేభవతి ప్రభవతి నకింభవతి భవతి రస్కారః॥ మత్స్యాదిభిరవతారై రవతారవతా త్వయావతా। వసుధాం పరమేశ్వర పరిపాల్యోభవతా భవతాప భీతోహం॥ దామోదర గుణమందిర సుందరవదనారవింద గోవింద। భవజలధి మథన మందర పరమందర మపనయత్వమ్మే। నారాయణ కరుణామయశరణం కరవాణి తావకౌ। చరణౌ ఇతిషట్పదముదీయే వదనసరోజే సదావసతు॥

అని శంకర యతీంద్రులును

క॥ నీపాదకమల సేవయు ♦ నీపాదార్చకులతోటి
నెయ్యమును నితాం ♦ తాపార భూతదయయును ♦
తాపసమందార నాకు దయసేయగదే॥

అని శ్రీభాగవతమునందు మాలాకారుడనే భక్తుడు శ్రీకృష్ణమూర్తివారిని ప్రార్థించినట్లు (సర్వభూతస్థమేకం వై నారాయణః) అనియు (ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి) అని సర్వభూతదయాంతరంగభగవద్భక్తితో ప్రార్థించుచు సత్వగుణధర్మములు, తనయందు తూచివైచినట్లు ప్రవర్తించుచు శ్రీగోపాలదేవుని మందిరమందు వుత్సవాదులలో నృత్యకాలక్షేపములను జేయుచు మధ్యమధ్య వీరాసన కమలాసనస్థుడై పూర్ణశాంభవీ లక్ష్యముతో దృష్టులను చెదరనివ్వకుండ ధారణచేసి ఐదేళ్ల బాల్యమందక్కడక్కడ సర్వులకు ముద్దుగా జూపుచు శ్రీగోవిందునిహృత్పంకజమందు ధ్యానించుచు సర్వజనానందుడై అందరిచే ఉపరి గోవిందమను నామమొందినవాడై శ్రీధృవునివలె ప్రకాశించినాడు.

ఇంక సాత్విక గుణధర్మములు వినుండు.



సీ॥ సత్య పవిత్రాచార సంపన్నుడై యుండు
సత్కర్మముల నెల్ల సలుపు చుండు
తపముమౌనంబునుత్సాహంబుఁ గలిగియుండు
శాస్త్రపురాణముల్ చదువుచుండు
ధ్యాన సుజ్ఞాన సన్మానముల్గలిగుండు
శ్రేష్ఠదానంబులు సేయుచుండు
శమదయంబులు శాంతిశ్రద్ధలు గలిగుండు
ధర్మమార్గంబులు దలఁపుచుండు
గీ॥ ధైర్యనిశ్చయబుద్ధి సద్భక్తినుండు
సకలభూతసముండు సాత్వికగుణుండు
రమ్యగుణధామ భద్రాద్రిరామసత్య
కామకరుణాలలామలోకాభిరామ॥

ఇంక శ్రీభారత శాంతియందు ఇంద్రునితో లక్ష్మీదేవి చెప్పిన సద్గుణధర్మములున్ను తన్నివాసస్థలమును నిందు పొందుపరచి చూపు చున్నాను చక్కగా చూడండి.

అనగా ఈచెప్పినది విజ్ఞానరూపిణియగు సుగుణదరిద్రదేవతయని యెరుంగవలెను.

సీ॥ గురుభక్తినిరతులు ♦ సురపితృపూజన పరులను
సత్యసం ♦ భాషణులును। దానశీలురు పర ♦

ధన పరదార పరాఙ్ముఖచిత్తులు • బ్రాహ్మణ
ప్రి। యులుదివానిద్రావి • యుక్తులువృద్ధదు
ర్బలదీనయోషిత్కృ • పారతులును। శౌచాఢ్యు
నతిథి భో • జనశిష్ట భోజులు నేను మెచ్చుజ
నంబు • లిట్లుగాక ।

గీ॥ ధర్మమొదలి కామంబుఁ గ్రో • ధంబుజాలఁ।
గలిగి గర్వులై బలియుఁభి • క్షంబు లిడక ।
పరుషవాక్కుల గ్రూరంపు • చరితములను।
మిగుల వర్తించు వారునా • మెచ్చుగారు॥

తా॥ గురుభక్తియు, దేవ పితృదేవ పూజయు సత్యవాక్కును, దానగుణమును, ఇతరులభార్యలను ధనమును గోలకుండుటయు, బ్రాహ్మణ భక్తియు, పగలు నిద్రించుటయు, ముసలివారియందును బలహీనులందును పేదలయందును స్త్రీల యందును దయయు, ఆచారమును, అతిథులు భుజింపగా మిగిలినది భుజించుటయు గలజనుల నేను మిక్కిలిమెచ్చెదను ధర్మమును విడచి కామక్రోధములుగలిగి, భూతబలియు భిక్షమునుచేయక కఠినముగ మాటలాడుచు గ్రూరులై యుండువారిని మెచ్చను.



క॥ బుద్ధియుధృతియునునీతియును । శ్రద్ధయునమ్మ
తియుక్షమయు • శాంతియు ననగా। వృద్ధశ్రీ
వ యేడ్వురు మ। ద్వృద్ధిప్రద దేవతలు శ్రు •
తిస్మృతికథితల్॥

తా॥ పెద్దలచే ధర్మముల నెరంగిన యింద్రుడా! బుద్ధియును, ధైర్యమును, నీతియు, శ్రద్ధయు, నమ్మతియును, ఓర్పును ననునీదేవత లేడ్గురును నన్ను వృద్ధిచేయువారు ఇట్లని వేదములయందును శాస్త్రములయందును జెప్పంబడి యున్నది,

క॥ అష్టమయగు దేవతనే। గష్టాత్మతయసురులం
దు • గనివిడచితి మ। త్తుష్టికరచరితు లగుట
ద్రి। విష్టపపరులకడ నిలిచి • వెలసెదననినన్॥

తా॥ మీదజెప్పంబడిన వారుగాక నేనిమిదవ దాననగు దేవతను రాక్షసులు దురాచారులగుటచే వారిని విడచి దేవతలయొద్ద నుండ వచ్చితినని చెప్పగా.

ఇది ధనలక్ష్మియనుకొందురేమో కాదు ధనల లక్ష్మివుంటే

క॥ ధనమెచ్చిన మదమెచ్చును మదమెచ్చిన మత్స
రంబు మానకహెచ్చున్ । ధనముడిగిన మద

ముడుగును మదముడిగిన మత్సరంబు మానక
యుడుగున్॥ అని వేమనాదులు చెప్పియుండిరి.

శ్లో॥ రాజశ్చోరరిపుస్వబంధు పశుపక్ష్యర్థ్యాదితో భీతి
దం । విత్తం శోకమద శ్రమాది జనకం జహ్యా
ద్బుధ సర్వదా । భృంగశ్చాపి మహాసహిర్గురు
పరో వైరాగ్య సంతోషదా । ప్రహ్లాదేతి సమ
బ్రవీ ద్ధృది భజేతం దత్త యోగీశ్వరం॥

తా॥ అవుడు దేవుండు ఓ ప్రహ్లాదా! రాజు, చోరుడు, శత్రువు, బంధువు, పశువులు, పక్షులు, యాచకులు, ఈ మొదలగువానివలన, ధనము భయము గలిగించునదియు, శోకము, మదము శ్రమము, ఈ మొదలగువానిని గలిగించునదియు గనుక బండితుడ యినవాడు, ధనము నెల్లప్పుడు విడువందగుగాన నాకు వైరాగ్యము గలిగించుటకు భృంగము, (తుమ్మెద) సంతోషమును కలిగించుటకు నజగరము గురు శ్రేష్ఠములగుచున్నవియని ప్రహ్లాదునకు ప్రత్యుత్తరమిచ్చినట్టి దత్తాత్రేయ యోగీంద్రుని మనంబున నెల్లవేళల భజించెదను మున్ను అజగరుడే యుష్మ డుదత్తాత్రేయుడై చెప్పినాడనుట. కనుక



చ॥ సపన్నుండొరుగానలేడు తనువున్ సంసారమున
న్మిహిం । లంపన్ జూమ దరిద్రుడెత్తుబడి
హిం । సింపన్ డన్యుల నాత్మకున్ సమముగా
భావించు నట్లవుటన్ ద । త్సంపన్నాంధులకం
జనంబు వినుడీ దారిద్ర్య మూహింపగన్॥

అని శ్రీభాగవతము పలుకుచున్నది.

చ॥ పరమేదో ఇహమేదో మాన్యు లెవరో ప్రఖ్యాతినా నెట్టిదో । యెరుగన్ నచ్చును భక్తి హెచ్చ హరిపై నిత్యం తనరానిదై । కరమబ్బున్ దయ హింసయన్న వెరవంగా జేయు దారిద్ర్యమే। పరమాకార సమస్త సద్గుణములన్ బ్రాపింపగా జేయుతన్॥ అని యింకొక మహానుభావులు చక్కగా వక్కాణించియుండిరి.

ఇంక బైబిలులో ఏసు క్రీస్తుప్రభువు ఇట్లుగాపలికి యున్నారు. లూకాసువార్త 6 అధ్యాయము

అప్పుడు ఆయన తన శిష్యుల తట్టు కన్నులెత్తి చూచి ఇట్లనెను.

బీదలైన మీరు ధన్యులు దేవుని రాజ్యము మీది

ఇప్పుడు మీరు ఆకలిగొనుచున్న మీరు ధన్యులు మీరు తృప్తిపరచబడుదురు.

ఇప్పుడు ఏడ్చుచున్న మీరుధన్యులు మీరు నవ్వెదరు
మనుష్యకుమారుని నిమిత్తము మనుష్యులుమిమ్మును ద్వేషించి వెలివేసి నిందించి మీపేరు చెడ్డదని కొట్టివేయునప్పుడు మీరుధన్యులు ఆదినమందు మీరు సంతోషించి గంతులువేయుడి ఇదిగో! మీఫలము ఆకాశమందు గొప్పది వారిపితృలు వాటినే ప్రవక్తలకు చేసిరి

అయితే అయ్యో! ధనవంతులారా! మీరు మీ ఆదరణ పొంది యున్నారు
అయ్యో! తృప్తులారా! మీరుఆకలిగొనియుందురు ఇప్పుడు నవ్వుచున్న వారలారా! అయ్యో! మీరు దుఃఖించి ఏడ్చెదరు

మనుష్యులందరు మిమ్మును కొనియాడునప్పుడు మీకు అయ్యో! వారి పితృలు వాటినే అబద్ధప్రవక్తలకు చేసేవారై యుండిరి. అనియిప్రకారము శిష్యులకు బోధించినాడు. కనుక ప్రియసుజనులారా!
విజ్ఞానరూపిణి యగు లక్ష్మీదేవిని అనగా దరిద్రదేవినికోరువారేధన్యులని మాయభిప్రాయము



ఒకదినమందు మాశివరామకృష్ణుడు మమ్ములను తనను దారాపుత్రాదులను కాపాడుకొనుటకు (నశ్వవృత్తిః కదాచన) అనియుండుటచే సేవకావృత్తి జేసిజీవించుట బాగుగా వుండలేదని వూహించినవాడై ధనాఢ్యులయందపేక్షలేనివాడై సన్మానములయందు కోరికలేనివాడై యేలనన (శ్లో॥ అసన్మానాత్తపో వృద్ధి సన్మానాత్తపసక్షయః) అని యార్యోక్తి యెరిగిన వాడై పరమ వైరాగ్యముతో నాహృదయమునుకనిపెట్టివిధేయతతో నాన్నగారూ తాతయ్యగారూ మీరు చేయునట్టి భిక్షాటననాకు కూడా లభించిన యెడల బాగుగా నుండగలనని తోచుచున్నది ఇంక నేనీపనిచేయజాలను శరీరమందు రుగ్మత ప్రవేశించుచున్నది కొంతకాలము చదువుకొనెదతదుపరి శ్రీశుకులువారుపరీక్షన్మహారాజునకు చెప్పినట్లు తాపసజీవనము అనగా సాధుజీవనము.

సీ॥ కమనీయ భూమి భాగములు లేకున్నవే పడి
యుండుటకు దూదిపరుపు లేల। సహజంబులగు
కరాంజలులు లేకున్నవే భోజన భాజన పుంజ
మేల। వల్కలాజిన కుశావళులు లేకున్నవే కట్ట
దుకూల సంఘంబులేల। గొనకొని వసియించు

గృహాలు లేకున్నవే ప్రాసాది సౌధాది పటల
మేల। ఫలరసాదులు గురియవే పాదపములు।
స్వాదుజలములునుండ నేసకలనదులు। బొసగభిక్ష
లుబెట్టరే పుణ్యసతులు। ధనమదాంధుల కొలు
వేల తాపసులకు॥ అనియు మఱియు

క॥ రక్షకులులేనివారల రక్షించెదననుచు జెక్కిరా
జై యుండన్। రక్షింపుమనుచు నొకనరునకుము
బ్రార్థింపనేల నాత్మజ్ఞులకున్॥

అని శ్రీభాగవతము రెండవ సాధనపంచకము నందు

శ్లో॥ క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం ప్రతిదినం భిక్షౌష
ధంభుజ్యతాం। స్వాద్వన్నం నతుయాచ్యతాం
విధివశాత్ప్రాప్తేన సంతుష్యతాం। శీతోష్ణాది
విసహ్యతాం నతువృథావాక్యం సముచ్చార్య
తాం। ఔదాసీన్యమభీప్స్యతాం జనకృపానై
ష్ఠూర్యముత్సృజ్యతాం॥ అనియు

శ్లో॥ భిక్షాన్నం దేహరక్షార్థం। కంథాశీతనివారణం।
అశ్మానంచ హిరణ్యంచ। శాకం శాల్యోదనం
సదా। సమానం చింతయేద్యోగి సూక్ష్మతత్వ
వపేక్షతే॥ అని ఉత్తరగీతయు.



శ్లో॥ వేదాంతవాక్యేషు విచారవంతః। భిక్షాన్నమా
త్రేచ తృప్తిమంతః అశోకవంతః కరుణైకవంతః
కౌపీనవంతః ఖలుభాగ్యవంతః॥ అని శ్రీకృష్ణ
శంకరభగవత్పాదాచార్యస్వామి మొదలైనవారుశు
క్లవృత్తి అనగా యాయావరవృత్తి బ్రాహ్మణునకువిధి
గా చెప్పియున్నారు. మీరుచేయుచున్నారు. నేనేల
చేయకూడదు అని పలికినవాడై ఇంక యీశ్వవృత్తి
నేను చేయజాలను వేళా పాళా లేకుండా నిత్యం
నలుగురు చేసేపని నావక్కని యెదుంచినారు
యెంత చేసినను మెప్పులేదు కనుక యీపనిని వద
లివేసి కొంతకాలము చదువుకొనెద అటుపైన్స్వతం
త్ర జీవనయాత్రకు యేదిబాగావుంటే అదిచేసెద
ఇంక మీయభిప్రాయము తెలియగోరెద. అనిచెం
కీపనిపై విసుగుదల గలవాడై నాతోపలుకగా నేను
వాడభిప్రాయమనుసరించి వెంటనే పనినివదిలివేయ
మని చెప్పగా ఒకకాగితముపైవనికి (రిజైన్) వ్రా
సిఅందుపై నాచేత వ్రాలుచేయించి తాను పంతక
ముచేసి బ్యాంకీదొరగారికి తీసుకు వెళ్ళి యిచ్చిన
వాడ యెను దానిని చూచి దొరగారు ఆశ్చర్యపడి
శివరామకృష్ణా ఎవరైనా సిద్ధాన్నము వదిలివేయు

దురా నీకే తోచినదా యెవరైనను చెప్పినారా
నాడెందమందెంతమాత్రము నీవు పనివదలివేయుట
యిష్టములేదు కొంతపని తగ్గించెదరొందర పడవద్దు
అని యనేక ప్రకారములుగా నచ్చచెప్పినను శరీర
బాధచే వీడువిననందున మేడపైకివెళ్ళి దొరసానిగా
రితోచెప్పిపంపగా ఆమెవచ్చి కన్నతల్లికన్న ఎక్కువ
మక్కువగలదై అనేక విధములుగా పనిని వదలి
వేయ వద్దనియు ముందుముందు దొరగారు సౌఖ్య
కరమైన పనియిప్పించెదరనియు మాయుభయులకు
నిన్ను పనినుంచి వదలివేయుట యిష్టములేదనియు
ప్రేమాతిశయముతో నచ్చచెప్పగా వారిమాటలను
వారిని నిరాకరించలేనివాడై యథాప్రకారము పని
చూచుకొనుచు యింటికొచ్చినవాడై నాన్నగారూ
ఇంక యీదేహమును బ్యాంకికిసమర్పింపవలసినదిగా
నున్నది నాకు యెంతమాత్రము స్వతంత్రత లేదు
అని తల పోటుతోను ఆసనమందు మంటతోను
యేడ్చుచు నావద్దకు వచ్చినవాడై వేడిచే ముక్కు
లనుండి రక్తము కాలిగ్రక్కుచు చతికిలబడి
కూర్చున్నవాడై ఆయాసపడుచుంటే నాకేమితో
చనివాడనై నాదరిద్రదేవత వీని నింతకాడికి తె



చ్చినదని యెంచినవాడనయి వానికి శైత్యోపచా
ములు చేయించి అన్నముతినిపించి పరుండనిచ్చినా
ము తదుపరి క్రమముగా గర్భమందు వాతప్రకో
పము హెచ్చుఅయి నిద్రాహారములకు దూరుడయి
బ్యాంకియను యజ్ఞవాటిక పశువై అనగా బ్యాంకి
యనునది యజ్ఞవాటికగాను నేను ఫలముపొందేయజ
మానిగాను ఆనందరావుగారు బ్రహ్మగాను తాబేదారు
లు ఋత్విక్కులుగాను యేర్పడి వీనిని యజ్ఞపశువు
గ నియమించి నెల తప్పకుండ వీనిరుగ్మతయజ్ఞమును
పూర్తిగావించి యజ్ఞపశువును బలవంతముగా బం
ధించి దానిప్రాణములు ఇంద్రాదులకు సమర్పించి
నట్లు వీనిప్రాణములను బ్యాంకి దొరలు మొదల
యినవారికి యిచ్చివేయడమయినది. ఆదినమందు
వుదయం 8 గంటలవేళ నాతో రహస్యముగా
దగ్గరకు పిలచినవాడయి నాన్నా యింక జీవితాశ
నాకు లేదు నేను నీకు ఎందుకునుపయోగపడిన వాడ
నుకాను శ్రీగోపాలమూర్తి ననమ్ముకొని యుండండి
అమ్మవగయిరాలతో చెప్పవద్దని కన్నీరు విడచిన
వాడయి వెంటనే ధైర్యమును తెచ్చుకొని నా
న్నగారు వెళ్ళి మీపని చూచుకొండని అతిజాగ్ర

...ంస్మరణ మనస్సులో చేయుచు సాయంత్రము మూడుగంటలవేళ వాతప్రకోపము విస్తరించి జ్ఞప్తి తప్పుచుండెనని కనిపెట్టినవాడై నాన్నా అని పెద్ద కేకవేసినవాడయి పంచపాళిలోనుంచి నేనవచ్చేయింతలో నిలువుగుడ్లతో యేకదృష్టిగా చూస్తూ కాళ్ళు నీగడదన్నివేసి అంతర్ముఖమునొందినవాడాయెను. అంతట నేను కొంతమంది స్నేహితులు మంచముపైనుండి క్రిందికి దించి పరుండబెట్టి కొంతమంది స్నేహితులు డ్రిస్సరుమొదలయినవారిని గురించి వెళ్ళితీసుకునివచ్చినవారయి వారిచేయింజక్షనువగయిరాలు చేయించగా తిరిగి అయిదుగంటలవేళ ప్రపంచజ్ఞప్తి వచ్చినవాడయి మేఘములలోనుంచి సూర్యుడు ఉదయించి ప్రకాశించినట్లు ప్రకాశించినవాడయి అందరికి నమస్కరించి యింతమంది వచ్చినారేమని నన్నడిగినవాడయి వెంటనే గ్రహించి తన్ను క్రింద పరుండబెట్టుటకు కారణము కనిపెట్టినవాడయి తిరిగి తన్ను మంచముపై పరుండబెట్టుమని చెప్పుచూ అందరిని చూచి నవ్వుతూ కొందరితోను నమస్కారములచే కొందరితోను విశేష సూచనలతో కొందరితో మాట్లాడిన



వాడయి అందరికి అమందానందము క...పివేసినవాడయి యీరాత్రి నన్ను దగ్గరపరుండబెట్టుకొని వక డ్రిస్సరుగారిని ఇద్దరువయిద్యులను వుండుటకు ప్రార్థించి వారివల్ల అవుషధములను గంటగంటకు పుచ్చుకొనుచు మహాజ్ఞప్తిగలవాడయి తెల్లవార్లు నిద్రపట్టనివాడయి అరుణోదయకాలమందు కించెత్తు నిద్రపోయినవాడయి వకదివ్యస్వప్నమును గని అనగా శ్రీనివాసమూర్తి వచ్చి తనకు రుక్మిణీసమేత సువర్ణ గోపాల విగ్రహములను యిచ్చి దగ్గర వుంచుకోమని చెప్పినట్లు వీడువారితో మీరెవరు స్వామీ మీపేరేమని అడిగినట్లుగా వారు నా పేరుశ్రీనివాసమూర్తియని అనగా వేంకిటేశ్వరులని పెద్దలు చెప్పుచుందురు నేను వచ్చి యిచ్చానని మీనాన్నగారితో చెప్పుము అని వెంటనే అంతర్ధానమొందగా తత్క్షణమే మెలుకువవచ్చిన వాడయి ముఖమార్జనకు భార్యను నీళ్ళువగయిరాలు తెమ్మని ముఖప్రక్షాళన చేసుకొని వాకిట్లో శ్రీ తడవర్తి దేవళరాజుఅన్నగారు నేను మాట్లాడుచుండగా మా వుభయులను పిలిచినవాడయి స్వప్నవృత్తాంతము మాతోచెప్పి స్వామి దివ్యమంగళ విగ్రహ

ఆన కచ్చేరువందుచు అపరిమితానందము ను
పొందినాడు. రెండవదినమందు తిరిగి ఆరైముసకే
వాతకూడిక విస్తరించి జ్ఞపితప్పుచుండె గ్రహించి
నవాడయి వాకిటవున్న బ్రాహ్మణు త్వరగా పిలు
వుమని పిలిపించి ఆమెతో బ్రాహ్మణ నన్ను బాగా
చూడుము చూచినావా అని మూడు మార్లడి
గినవాడయి ఆమెకు నమస్కరించి యింక వెళ్ళుము
అనిచెప్పినవాడయి నావంకకు తల్లివెపునకు భార్యా
వైపునకు చూచినవాడయి వెంటనే మనస్సును దృ
ష్టిని త్రిప్పికొని (హరే రామ హరే రామ రామ
రామ హరే హరే హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ
కృష్ణ హరే హరే) అని స్మరించుచు అంతర్ముఖ
మును పొందినవాడాయెను. ఇంక ప్రపంచజ్ఞప్తి
లేనివాడయి వాతప్రకోపమున కాళ్ళు చేతులు వ
ణికించుచుండగా మేము వెంటనే అయిదుగురు డ్రస్స
ర్లను పెద్దడాక్టరుగారిని పిలిపించినవారి మైవారిచేత అనేక
అవుషధములను వారిశక్తి వంచనలేకుండ ఇంజక్ష
నులువగయిరాలను రాత్రి పదకొండు గంటలవరకు
చేసినవారై ఇంకప్రయోజనము లేదనినిశ్చయించి
వానినిక్రిందపరుండబెట్టి నాతో చెప్పి విచారిస్తు వెళ్లి



నవారాయెను. తదుపరికొంచెముకాలముప్రియాసం
దిపాప్రాణములు దేహమునుండి వెలువడినవయి నేత్ర
మూలద్వారా జీవకారతి వయికుంఠమునుగూర్చి వెళ్ళి
నదాయెను. ఆరాత్రి మాయిల్లు దీపకాంతులచేతను
హరిస్మరణలచేతను ప్రకాశించుచు శ్రీరంగభవన
మా అనేలాగున కొందరికి మరి కొందరికి
యమధర్మరాజు వచ్చి వెంటబెట్టుకొని తీసుకువెళ్ళి
నాడా యేమి అని తల్లి మొదలయినవారి రోదన
ములను విని ఖిన్నులయి దుఃఖించి వెళ్ళినారు. కొం
దరు శవముచుట్టు తెల్లవార్లు పరుండి కాపాడినారు.
అయ్యలారా! పాండవగీతలలో చెప్పినట్లు శ్లో॥ విప్ర
క్షేషు ధనందత్తం । స్వదారేషుచ యవ్వనం । స్వా
మికార్యహతః ప్రాణః అంతె పశ్యతిమాధవం ॥
వీరిట్లు సర్వదా ప్రవర్తించి వృత్తి కాల
మందు దైవసాక్షాత్కారము పొందినవాడాయెను.
తదుపరి వాడివిషయమై శ్లో॥ సత్యంబ్రవీమిమనుజా
స్స్వయ మూర్ధ్వబాహుః। యోయోనూం ముకుంద
నరసింహ జనార్దనేతి॥ జీవో జపత్యనుదినం మర
ణే రణేవ । పాషాణ కాష్ఠ సదృశాయ తథాన్వ
భీష్టమ్॥ అని శ్రీకృష్ణమూర్తియు శ్లో॥ గోవింద

మాధవ హరే మురారే, శంభో శివేశ శశి శేఖర శూలపాణే, దామోదరాచ్యుత జనార్ధనవాసుదేవ, త్యాజ్యా భటాయ ఇతి సంతతి మామనంతి॥ అని యమధర్మరాజు చెప్పిన ప్రకారము జరిగినది.

సుజనులారా !

వీరిజాతకమునందు శ్లో॥ భాగ్యస్థానం గతే మందే వైకుంఠాదాగతో నరః। రాజ్యం కృత్వామహీం భుక్త్వా పునః స్తత్రైవ గచ్ఛతి॥ అని యుండుటచే ఇత్థంవాచస్పతి శ్రీకృష్ణయో స్సంవాద స్సమజని సురాచార్యః శ్రీకృష్ణం పప్రచ్ఛ సహోవాచ శ్రీకృష్ణః మమ అవతారేషు యవ్వనకాలేమత్కృత అసత్యాదికం యద్వర్తతే తదప వాద దోష నివృత్యర్థం కించ ఇదానీం దేవకీ వసుదేవాభ్యాంనహా భువ మాంగల్య భూతలే తావత్ భూసుర శ్రేష్ఠస్య వంశే జనిత్వాహం బాల క్రీడయా మాతా పితౄన్ తోష ఇత్వా కించిత్కాలం తత్రివసన్ పునరపి వైకుంఠ సదనం గంతుమిచ్ఛా వర్తతే తస్మాత్కారణాత్ గమిష్యామి॥

శ్లో॥ కస్మాద్దాయాసి కృష్ణ వ్రజసి సురగురో కుత్ర వైకుంఠ ధామాత్తత్తద్వక్ష్యామి సర్వంస్ఫుట



తరమధునా భూతలం యామిమంత్రిన్, న్ముట్నూరు వంశే ప్రథిత గుణగణో ధార్మికస్సత్యవాదీ శ్రీమాన్గోపాలదాస స్సకల బుధజనైః శ్లాఘితో భూసురోఽస్తి॥ శ్లో॥ తజ్జాయా సుబ్బమాంబా సకల గుణయుతా భాతి సాధ్వీచనిత్యం తద్గర్భా జ్జాయమానో ఘనతర శివ శ్రీరామ కృష్ణాభిధానః స్థిత్వా హంసర్వదాస్మి న్సకల కవిజనైః స్సేవ్యమానస్తథాపి పిత్రోస్సమ్యక్ సురార్య నిఖల గుణవతోర్భక్తి మానేవకించిన్న త్వాశుశూష మాణ స్తదుపరి పరమం యామి వైకుంఠవాసం॥

మఱియు ఇంద్రనారద సంవాదః

శ్లో॥ దేవ శ్రేష్ఠ త్వమయాసివాసవభువం చేత్తత్రినారా
యణో । దృష్టస్తైశ్శృణుసావధానమనసావక్ష్యే
సురాధీశ్వర । శ్రీముట్నూరికులాబ్ధి శీతకిరణో
శివరామకృష్ణాఖ్యత । సోఽయంజాతఇతి శ్రుత్వా
హిబహుశస్సాకిం వదంతీమయా॥

అని చెప్పినట్లుగా

ఇట్లు శ్రీవారు జ్యోతిశ్శాస్త్ర వైద్యశాస్త్ర ఉభయ భాషా పాండిత్య ప్రకర్షణ విద్వజ్జనాదరణీయసరస కవితా చాతుర్యేణ వీరవల్లి తాలూకా పోతన

…రామ కృష్ణయ్య జీవితము.

…గ్రామ వాసినా కోట కామశాస్త్రిణా విరచిత శ్రీకృష్ణ గురు ప్రశ్నోత్తర సంవాద శ్లోకాః లిఖ్యంతే

ఓంతత్సత్.

శ్రీ అపరప్రహ్లాదుడు ముట్నూరిం శివరామ

కృష్ణయ్య జీవితము రెండవ భాగము

సమాప్తః

శ్రీకృష్ణార్పణమస్తు. శ్రీ శ్రీ శ్రీ



# ప్రకటన.



ఇందు శ్రీభాగవతమునందు ప్రహ్లాదుడు రాక్షస కుమారులకు ,, మనకుబుట్టని, చావని, త్రోవ వెదకుకొనుట దొడ్డబుద్ధి '' అని బోధించిన పరమపద ధర్మమార్గములు ముముక్షువులకు సులభముగా దెలియుటకై శ్రీ॥ ము॥ శివరామ కృష్ణయ్య ప్రవర్తన అందుకు శాస్త్రసమ్మతముగా సరిపడియుండుటచే వాని పేరుమీద చూపుటకు మహారాజశ్రీ దేవరకొండ జగన్నాధరావు ఎమ్. ఎ. గారుఅత్యంత ప్రోత్సాహము చేయుచు ద్రవ్య సహాయము చేయుటచే ముద్రింపగలిగితిని.

ముట్నూరి గోపాలదాసు,

కాకినాడ.

